శ్రీరస్తు

భోజరాజవిరచిత

# చారుచర్య

అప్పమంత్రి విరచిత

ఆంధ్రపద్యసహితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

 [Rs. 0—6—0

# వైద్య గ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అనుపానమంజరి | ... | 0 | [illegible] |
| అజీర్ణమంజరి | ... | 0 | 4 |
| చరకసంహిత, సూత్రస్థానము 1-సంపుటము | ... | 6 | 0 |
| ,, శారీర, ఇంద్రియ, నిదాన, విమానస్థానములు 2 | ... | 5 | 0 |
| ,, చికిత్సాస్థానము 3 | ... | 8 | 0 |
| ,, సిద్ధి-కల్పస్థానములు 4 | ... | 3 | 8 |
| అష్టాంగహృదయము, సూత్రస్థానము | ... | 8 | 0 |
| డిటో చికిత్సాకల్పస్థానములు | ... | 5 | 0 |
| డిటో శారీరనిదానస్థానములు | ... | 3 | 0 |
| డిటో ఉత్తరస్థానము | ... | 6 | 8 |
| ఆయుర్వేదసారసంగ్రహనిధి | ... | 4 | 8 |
| కాలజ్ఞానము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 4 |
| రావణకుమారతంత్రము ,, | ... | 0 | 6 |
| గదనిగ్రహము ,, | ... | 2 | 8 |
| ఘృతతరంగము ,, | ... | 1 | 4 |
| చికిత్సాసారము ,, | ... | 2 | 8 |
| నాడీజ్ఞానము ,, | ... | 0 | 4 |
| బసవరాజీయము | ... | 12 | 0 |
| భేషజకల్పము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 8 |
| దేహతత్త్వనిర్ణయము ,, | ... | 0 | 4 |
| మశూచికము (Small-pox) | ... | 0 | 4 |

శ్రీరస్తు

భోజరాజవిరచిత

# చారుచర్య

అప్పమంత్రి విరచిత

ఆంధ్రపద్యసహితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1949

# పీఠిక

తెనుఁగుభాషలో వెలసిన కొలది శాస్త్రీయగ్రంథముల నీచారుచర్య యొకటి. ఇది వైద్యశాస్త్రమునకు సంబంధించినది. అయిన నావైద్యశాస్త్రమున రోగములను, వానిలక్షణములను వానిచికిత్సలను నౌషధములను తెలుపక, రోగములు రాకుండ మానవు డెట్లు తనయారోగ్యమును కాపాడుకొనుచు, దృఢకాయుడై, చిరజీవిగా నుండగలడో ఆపద్ధతులను దెలుపున దీలఘుకృతి. ఇది కేవలము పద్యమయము. శాస్త్రీయగ్రంథములు కూడ తెనుఁగున మొదట పద్యమయములుగ వెలువడుటచే నిదియును నాదారినే యనుసరించినది. తెనుగులో క్రీ. శ. 1450 కి ముందు వెలసిన శాస్త్రీయగ్రంథములు.

గణితము (Mathematics)

1. సారసంగ్రహగణితము—పావులూరిమల్లన

రాజనీతి (Political Science)

2. నీతిభూషణము—ఆంధ్రభోజుడు
3. నీతిసారము—రుద్రదేవుడు
4. కామందకము—కవిపేరు తెలియదు
5. పంచతంత్రము— ,,

రుషార్థసారము—శివదేవయ్య

ుద్రామాత్మ్యము—కవిపేరు తెలియదు

ద్దిసీతులు లేక నీతిసారముక్తావళి—బద్దెన

మడికిసింగన సకల నీతిసమ్మతములో వాని పేర్కొన్నాడు.

వ గ్రంథము పూర్తిగ లభ్యమగుచున్నది.

## ధర్మశాస్త్రము (Law)

9. విజ్ఞానేశ్వరీయము—కేతన

## వ్యాకరణము (Grammar)

10. ఆంధ్రభాషాభూషణము—కేతన

## ఛందశ్శాస్త్రము (Prosody)

11. కవిజనాశ్రయము—మల్లియ రేచన
12. గోకర్ణచ్ఛందస్సు—గోకర్ణుడు
13. అధర్వణచ్ఛందస్సు—అధర్వణుడు
14. అనంతచ్ఛందస్సు—అనంతుడు

## అలంకారము (Poetics)

15. కావ్యాలంకారచూడామణి—విన్నకోట పెద్దన
16. రసాభరణము—అనంతుడు

## వైద్యము (Medicine)

17. చారుచర్య—అప్పనమంత్రి (Helth and Hygiene)
18. పశువైద్యము—నారనమంత్రి (Cattle Medicine)

19. అశ్వవైద్యము—(Horses) మనుమంచిభట్టు

వాతావరణము వ్యవసాయము (Meteoroloy & Agriculture)

20. సస్యానందము—దోనయామాత్యుడు

ధాతుశాస్త్రము (Precious metals)

21. రత్నశాస్త్రము—భైరవకవి (Metallurgy)

సాముద్రికశాస్త్రము (Palmistry)

22. సాముద్రికశాస్త్రము—అప్పయమంత్రి

వేదాంతశాస్త్రము (Philosophy)

23. జ్ఞానవాసిష్టము—మడికిసింగన

కవి కాలము

ఈ గ్రంథరచయిత అప్పనమంత్రిగూర్చి చారుచర్యలో తెలియవదానికంటె హెచ్చుగా మన కేమియు తెలియరాలేదు. ఈ చారుచర్యలోగల 35వ పద్యము "కొనగొని కొండముచ్చులు చకోరములున్ శుకశారికావళుల్" అను 35-వ పద్యము మడికి సింగన సకలనీతిసమ్మతములో నుదాహరించినాడు. సింగనకాలము క్రీ. శ. 1400 ప్రాంతము కావున అప్పన యంతకుముందువాడగును.

అనువాదరీతి

మూలశ్లోకములను కొన్నిటిని వేర్వేరుగా చిన్న పద్యములు గాను, 4, 5 శ్లోకములను సీసముగాను వ్రాసి

యున్నాఁడు. మొత్తముపైని యాంధ్రీకరణము బాగుగనున్నది.

మచ్చునకు—

శ్లో. మలినం పరవస్త్రంచ స్త్రీవస్త్రంచ తథైవచ,
ఖండంచ మూషకై ర్విద్ధ మగ్నిదగ్ధంచ వై త్యజేత్.

ఆ. మలినమైన యదియు మగువ గట్టినయది
నితరజనుల యదియు నెలుకపోటు
ఖండమైన యదియు గాలినయదియు వ
ర్జింపవలయుఁ జుమ్ము చీరలందు.

2౯-వ పద్యము

శ్లో. లోకేఽస్మిన్ మంగళాన్యష్టబ్రాహ్మణోగౌర్హుతాశనః,
హిరణ్యం సర్పిరాదిత్య ఆపోరాజాతథాష్టమః.

క. గోవుం గనకము విప్రుఁడు
పావకుడు ఘృతంబు జలము భానుండు ధరి
త్రీవిభు డీయెనిమిదియు శు
భావహములు మంగళాష్టకాఖ్యంజెందున్.

30-వ పద్యము

ఈగ్రంథముద్రణమున కీక్రింది ప్రతులు తోడ్పడినది.

1. తాళపత్రప్రతి (తెనుగు) ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తక
భాండారము సంఖ్య 3875

2. సంస్కృతము ద్రవ్యగుణరత్నాకరము లేక ద్రవ్యరత్నాకరము.

3. ముద్రితప్రతి శ్రీమాహిష్మతీముద్రాక్షరశాల, ముక్త్యాల, 1922.

పై వానిలో రెండవదియగు ద్రవ్యరత్నాకరమే చారుచర్య యని పేర్కొనబడినది. ఇది 33 వర్గములుగల సంస్కృతగ్రంథము. దీనితో తెనుగు చారుచర్య సరిచూడబడినది. ఈసంస్కృతమూలమును మేము ముద్రించుచున్నారము.

తెనుగున దీనివెనుక వైద్యశాస్త్రగ్రంథములో వేదయ ఆయుర్వేదార్థసారసంగ్రహము అచ్చుకాలేదని వినుచున్నాము. ఈతఁడు ప్రసిద్ధుఁడగు అనంతామాత్యునికొమారుఁడట. దానిని ముద్రించుటకు యత్నించుచున్నాము.

సంస్కృతాంధ్రములలో చారుచర్యలను ఆంధ్రసాహిత్య పరిషత్తునుండి సంపాదించి ప్రతులను వ్రాసి పరిష్కరించిన శ్రీయుత చిలుకూరి పాపయ్యశాస్త్రిగారికి మేము కృతజ్ఞులము.

ఇట్లు,

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్.

శ్రీ

## భోజరాజకృత

# చారుచర్య

---

సునీతిశాస్త్ర సద్వైద్యధర్మశాస్త్రానుసారతః,
విరచ్యతే చారుచర్యా భోజభూపేన ధీమతా. 1
బ్రాహ్మే ముహూర్తే ఉత్తిష్ఠేత్స్వస్థో రక్షార్థమాయుషః,
శరీరచింతాం నిర్వర్త్య కృతశౌచవిధిస్తతః. 2

### అథ దంతధావనవిధిః

ప్రాతరుత్థాయ విధినా కుర్యాద్దంతప్రధావనం,
వాగ్యతః పుణ్యకాష్ఠేన అతఊర్ధ్వం క్రమేణతు. 3
ఆయుర్బలం యశో వర్చః ప్రజాః పశు వసూనిచ,
బ్రహ్మప్రజ్ఞాం చ మేధాం చ త్వం నో దేహి వనస్పతే. 4
సర్వే కంటకినః పుణ్యాః క్షీరిణ్యశ్చ యశస్వినః,
ఆమ్లపున్నాగ బిల్వానామపామార్గశిరీషయోః. 5
కటుతిక్తకషాయాశ్చ ధనారోగ్యసుఖప్రదాః,
దశాంగుళంతు విప్రాణాం క్షత్రియాణాం నవాంగుళం. 6
అష్టాంగుళం తు వైశ్యానాం శూద్రాణాం సప్తసమ్మితం,
చతురంగుళమానం తు నారీణాం తు న సంశయః, 7

ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖో వా దంతధావనమాచరేత్,
దక్షిణేన తథా క్రౌర్యం పశ్చిమేన పరాజయం. 8
పూర్వస్యాముత్తరస్యాం చ సర్వాన్కామానవాప్నుయాత్,
చతుర్దశ్యష్టమీదర్శపూర్ణిమాసంక్రమారవేః. 9
విష్ణుస్త్రీతైలమాంసాని దంతకాష్ఠం చ వర్జయేత్,
సర్జే ధైర్యం వటే దీప్తిః కరంజే విజయో రణే. 10
జాతౌ చైవార్థసంపత్తిః బదర్యాం మధురస్వరః,
ఖదిరే చైవ సౌగంధ్యం బిల్వే తు విపులం ధనం. 11
శాల్మల్యశ్వత్థ భవ్యానాం ధవకింశుకయోరపి,
కోవిదారశమీపీలుశ్లేష్మాతకవిభీతకాః. 12
వర్జయేద్దంతకాష్ఠం తు గుగ్గులిం క్రముకం తథా,
ఔదుంబరే వాక్యసిద్ధిః బంధూకే చ దృఢాశ్రుతిః. 13
ఆమ్లే కీర్తిశ్చ సౌభాగ్యం కదంబే సిద్ధిరుత్తమా,
గువాకరాగరీతాలకేతకీసుమహాద్వటాః. 14
ఖర్జూరీనారికేళశ్చ సప్తైతే తృణరాజకాః,
తృణరాజశిరాపత్రైర్యః కుర్యాద్దంతధావనం. 15
తావద్భవతి చాండాలో యావద్గంగాంనపశ్యతి,
భల్లాతకీదేవదారుమదయంతీతువాలుకైః, 16
తృణాంగుల్యశ్మలోహాద్యైశ్శత్రుభ్యస్సాధ్వసం జగుః,
హారీతకీవిష్ణునాగకతకోద్దాలతాపసైః. 17
కార్పాసాధక వాకూచీబలాశ్లేష్మాతకైర్గతః,
పలాశాశ్వత్థజంబీరమాతులుంగకపిత్థకైః. 18

అగస్త్యతాలహింతాలకుశకాశైస్తథానిశా,
తింత్రిణీకశమీవేణుశుద్ధామళకవంజులైః. 19
వికంకతవ్యాఘ్రపాదసంజ్ఞప్రక్షైగస్త్యశశిషయః,
రోహీ గండూషసమయే తర్జన్యా వక్త్రచాలనం. 20
యది కుర్వీత మూఢాత్మా నరకే పతతిధ్రువం,
నాద్యాద్దర్జిర్ణవమథుశ్వాసకాసజ్వరార్దితః. 21
తృష్ణాస్యపాకహృన్నేత్రశిరః కర్ణామయే చ తత్,
మధ్యాహ్నస్నానవేళాయాం యః కుర్యాద్దంతధావనం. 22
నిరాశాస్తస్య గచ్ఛంతి దేవతాః పితృభిస్సహ,
అలాభే దంతకాష్ఠానాం నిషిద్ధాయాం తథా తిథౌ. 23
అపాం ద్వాదశ గండూషైః ముఖశుద్ధిర్భవిష్యతి,
జిహ్వానిర్లేఖనం కార్యం సౌవర్ణం తామ్రమేవవా. 24
తన్మలాపహారం శస్తం మృదుశ్లక్ష్ణం షడంగులం,
పిత్తశ్లేష్మహారం రుచ్యం నైర్మల్యం చక్షుషోర్హితం,
శ్రోత్రనాడ్యోర్విశుద్ధ్యంతే నరాణాం దంతధావనాత్. 25

౨ స్నానవిధిః

పుణ్యనిర్మలతోయేన పాదౌ ప్రక్షాళ్య వాగ్యతః,
మలాపకర్షణార్థాయ స్నానం కుర్యాత్ప్రయత్నతః. 26
ఉష్ణాంబునాధఃకాయస్య పరిషేకోబలావహః,
తేనైవ చోత్తమాంగస్య బలాధృత్కేశచక్షుషోః. 27
స్నానమర్దితనేత్రాస్యకర్ణరోగాతిసారిషు,

ఆధ్మానపీనసాజీర్ణభు క్తవత్సు చ గర్హితం. 28
స్నానానంతరకం సమ్యగ్వస్త్రేణోద్వ ర్తయే త్తనుం,
కాంతిదం చ శరీరస్య కండూత్వగ్దోషనాశనం. 29
పిటికవ్యంగదోషఘ్నముద్వ ర్తనముదాహృతం,
భూమేస్సముద్ధృతం పుణ్యం తతః ప్రస్రవణోదకం. 30
తత్రాపి సారసం పుణ్యం తస్మాచ్చా దేయము త్తమం,
తీర్థతోయం తతః పుణ్యం గంగాపుణ్యం చ సర్వతః. 31
రూపం తేజో బలం కాంతిశ్శౌచమాప్యాయనం తనోః,
దుస్స్వప్ననాశనం పుణ్యం స్నానమాయుష్యవర్ధనం. 32
అత్యంతమలినః కాయో నవచ్ఛిద్రసమన్వితః,
స్రవత్యేవ దివారాత్రౌ ప్రాతఃస్నానేన శుద్ధ్యతి. 33
కులాచారం తతః కుర్యాత్సంధ్యోపాసనమాదితః,
సూర్యోపాస్తిం తతః కుర్యాత్సర్వరోగాపను త్తయే. 34
కేశానాం నిచయంకుర్యాత్కస్తూరీమనులేపయేత్,

## 3 పుష్పధారణవిధి

సుగంధీని సుపుష్పాణి నిత్యం శిరసి ధారయేత్. 35
కేశక్లేశ సముద్భూతస్వేదదుర్గంధనాశనం,
చక్షుష్యం దాహశమనం సౌమనస్యస్య ధారణాత్. 36
జీవాద్యా లి ప్తకేతక్యాః కోమలం ధారయేద్దళం,
జాతీకుందం చ నేపాళం శ్రీకంఠగిరిమల్లికా. 37
మకరందేన సంయుక్తం శిరసా ధారయేన్నరః,

మలినే మల్లికాధార్యా నిర్మలేజాతిపాటలే. 38
అభ్యంగే కేతకీధార్యా చోత్పలం సతతం వహేత్,
సర్వాణ్యేతాని శీతాని రసతోవీర్యత స్తథా. 39
త్రిదోష శమనం శ్రీమాన్ ఘర్మకాలే ప్రధారయేత్,
కేతకీవకుళం పుష్పం శ్రీఖండం శతపత్రకం. 40
శ్రీపర్ణం చంపకం పుష్పం వాతశ్లేష్మహారం పరం,
ఉష్ణవీర్యం వాతనాశం శీతకాలే ప్రధారయేత్. 41
హ్రీబేరం మరువం చైవ నీలోత్పలసుచంపకా,
కురువం పాటలం చైవ కరవీరం తథైవచ. 42
నాత్యుష్ణం మధవాసీతం సర్వదోషనిబర్హణం,
నిర్మలం నేత్రదోషఘ్నువర్షాకాలే ప్రధారయేత్. 43
ముహూర్తం జాతికుసుమం నేపాళం చోత్పలం తథా,
త్రిరాత్ర ముత్పలం చైవ పంచరాత్రం తు కేతకీ. 44
ద్విరాత్రం శతపత్రం చ అర్ధరాత్రం తు మల్లికా,
అహోరాత్రం చంపకం తు యూధిపుష్పం తథైవ చ. 45
శ్రీకంఠ మేకరాత్రం చ వకుళం మాధవీతథా,
అహారేకం తు శ్రీపర్ణం పుష్పవాసం నిధారయేత్. 46
మందారం కురువంచైవ కరవీరం తథైవ చ,
యావత్కాలం వహేద్గంధం తావత్కాలం చ పాటలీ. 47
త్రిదోషశమనా జాజీ మహాదాహవినాశినీ,
సుగంధం దోషశమనం కోటరం పుష్పముచ్యతే. 48
పిత్తహృన్నిశదం శైత్యం చక్షుష్యం చోత్పలం తథా,
శ్లేష్మవాతప్రశమనముష్ణభావంచ నిర్మలం. 49
పుష్పాణాం ప్రవరం శ్రేష్ఠం కేతకీపుష్పముచ్యతే,

ఈషదుష్ణం సుశీతం చ సుగంధం పుష్టిదాయకం. 50
శిరోభ్రమవినాశం చ శతపత్రం సుశోభనం,
అథార్యం మల్లికా పుష్పం దృష్టిహానిస్తుజాయతే. 51
చంపకం వాతశమనం చక్షుష్యం విశదం శుభం,
పాటలం చ మహాశీతం శ్లేష్మవాతప్రవర్ధనం. 52
మందారం పిత్తదోషఘ్నం కర్ణబాధిర్యనాశనం,
పాటలం ధారయేద్వస్తు మరువేణ సమన్వితం. 53
జ్వరమూర్ఛామవాతఘ్నం చక్షుష్యం దాహనాశనం,
హేమంతే శిశిరే చైవ శతపత్రం తు శోభనం. 54
వసంతే కేతకీ ధార్యా ఘర్మే నేపాళమాలతీ,
వర్షే శ్రీకంఠపాటల్యౌ శారదే చంపకం వహేత్. 55
రక్తోత్పలం సర్వకాలం ధరే ల్లక్ష్మీవివృద్ధయే,

## ౮ లేపనవిధి

కుసుమం చందనం చైవ తథాగరువిమిశ్రితం. 56
ఉష్ణభావమిదం శ్రేష్ఠం శీతకాలే తు లేపయేత్,
చందనం చేందునా యుక్తం కస్తూర్యా సహ మిశ్రితం. 57
సుగంధం చ సుశీతం చ ఘర్మకాలే ప్రధారయేత్,
చందనం ఘుసృణోపేతం ఈషత్కస్తూరికాయుతం. 58
నచోష్ణం న చ వా శీతం వర్షాకాలే ప్రధారయేత్,
ఆదౌ చోద్వర్తయేద్గంధం పశ్చాద్గంధం ప్రలేపయేత్. 59

## ౯ వస్త్రధారణవిధి

శీతకాలే తు కౌశేయం కషాయం ఘర్మవాసరే,
వర్షాసు శుక్లవస్త్రం స్యాత్ త్రిధా వస్త్రస్య ధారణమ్. 60

కౌశేయం చిత్రవస్త్రం చ రక్తవస్త్రం తథైవ చ,
వాతశ్లేష్మహరం న్ృణాం శీతకాలే తు ధారయేత్. 61
మధ్యం సుశీతపిత్తఘ్నం కాషాయం వస్త్రముచ్యతే,
తద్ధారయేద్ఘర్మకాలే కాషాయం వస్త్రముత్తమం. 62
శుక్లం సుశీతలం చైవ శీతతాపనివారణం,
న చోష్ణం న చ వాశీతం శుక్లం వర్షాసు ధారయేత్. 63
మలినం పరవస్త్రం తు స్త్రీవస్త్రం తు తథైవ చ,
ఖండం చ మూషికైర్భిద్ధం అగ్నిదగ్ధం చ వర్జయేత్. 64
మలినం నశివం తత్తు కండూత్వగ్దోషకారణం,
సుకృతస్య ఫలం నాస్తి పరవస్త్రస్య ధారణాత్. 65
కార్యహానిర్దుర్బలత్వం స్త్రీవస్త్రేణ ప్రజాయతే,
ఖండవస్త్రే వసే జ్జ్యేష్ఠా తస్మాత్తత్పరివర్జయేత్. 66
భయదం మూషికైర్భిద్ధం దగ్ధేన చ మృతిర్భవేత్,
తస్మాత్సర్వప్రయత్నేన శోధ్యవస్త్రం ప్రధారయేత్. 67
సుహృత్సు శుభదం చైవ దర్శనేన ప్రజాయతే,
రత్నాని దేవతాతుష్ట్యై భూషణాన్యపి ధారయేత్. 68

ఒ నవరత్నధారణవిధి

ఆదిత్యే పద్మరాగం చ సోమే ముక్తాఫలం తథా,
మంగళే విద్రుమం చైవ బుధే మరకతం తథా. 69
గురౌ తు పుష్యరాగం చ భార్గవే వజ్రముత్తమం,
మందే తు నీలమిత్యుక్తం రాహోర్గోమేధికం తథా. 70

కేతుర్వైడూర్యమిత్యుక్తం క్రమాద్రత్నస్య లక్షణం,
మోహాహోరజితహేమనితామ్రం కాంస్యం చ పంచకం. 71

౭ పంచలోహప్రశస్తి.

స్త్రీ బాలావృద్ధఘాతీ చ తథాగో బ్రహ్మఘాతకం,
సర్వపాపవినిర్ముక్తైర్యై పంచలోహసంప్రధారయేత్. 72

౮ తర్పణవిధి

ధర్మసంగ్రహణం కుర్యాద్దానతీర్థోపవాసకైః,
స్వబంధుపితృదేవానాం బ్రాహ్మణానాం చ తర్పణం. 73
స్వర్గ్యం యశస్యమాయుష్యం సర్వపాపహరం శుభం,
దేవబ్రాహ్మణబంధూనాం తర్పణేన ప్రజాయతే. 74

౯ భోజనవిధి

తతో భోజనవేళాయాం కృతాచారస్సదాత్మవాన్,
దేవాన్పితౄన్సమభ్యర్చ్య కుర్యాన్మంగళవీక్షణం. 75
లోకేస్మిన్మంగళాన్యష్టౌ బ్రాహ్మణోగౌర్హుతాశనః,
సువర్ణం సర్పిరాదిత్యం ఆపోరాజా తథాష్టమః. 76
ఏతాని సతతం పశ్యేన్నపశ్యేదర్చయేద్యథా,
ప్రదక్షిణం చ కుర్వీతఆయుర్వర్ధనముత్తమం. 77
పత్నీవిహితశృంగారం ప్రాప్య భోజనమందిరం,
యదాచాగ్నిబలం వీక్ష్యభోజనం కారయేద్బుధః. 79
ఏకఏవ సభుంజీత యదేచ్ఛేత్ప్రియమాత్మనః,
భోక్తుకామశ్చ దాతుశ్చ క్రోధవా న విగర్హితః. 78

అన్నం విషసమం ప్రాహురజీర్ణం ప్రాప్నుయాన్నరః,
ద్విత్రిభిర్భవాభిస్సార్థం భోజనేన ప్రజాయతే. 80
అభీష్టఫలసంసిద్ధిః తుష్టి కామ్యసుసంపదః,
చకోరం మర్కటం కృష్ణం శారికాంచ సుఖం తదా. 81
అమాత్యరాజ పుత్రాణాం గృహేష్వేతాని రక్షయేత్,
చకోరం చక్షుషోర్నీలం విష్ఠాం ముంచతి మర్కటః. 82
దృష్ట్వాన్నం విషసంయుక్తం కూజంతి శుకశారికాః,
తేషాం దృష్టినిపాతేన అన్నాద్యం నిర్విషం భవేత్. 83
పరవిద్యావినాశార్థం తేషాం దర్శన ముచ్యతే,
కార్తికాద్యమపరః పక్షో మార్గశీర్షస్య చాదిమః. 84
ద్వావేతౌ యమదంష్ట్రాభ్యా మితాహారస్సుజీవతి,
ఆదౌ మధుర మశ్నీయాన్ మధ్యే చ కటుతిక్తకం,
అంతే తిక్తకషాయం చ సమ్యగ్జీర్ణం సుఖావహం. 85
భోజనాదౌ పిబేత్తోయమగ్నిసాదం కృశాం గతా,
మధ్యే కార్శ్యవివృద్ధేత అంతే శ్రేష్ఠం రసాయనం. 86
అత్యంబుపానాదవిపచ్యతేన్న మనంబుపానాచ్చసఏవదోషః,
తస్మాన్నరో వహ్నివివర్ధనాయ ముహుర్ముహుర్వారి పిబేదభూరి.
పిబేద్ఘటసహస్రాణి యావదస్తం గతే రవౌ,
నిశి భోజనవేళాయాం స్వల్పముప్యుదకం విషం. 88
అన్నేన కుక్షౌద్వావంశౌ పాదేనైకం ప్రపూరయేత్,
ఆశ్రయం పవనాదీనాం చతుర్థమవశేషయేత్. 89
అత్యాహారాద్భవేద్వ్యాధిరనాహారాద్బలక్షయః,

సమాహారాద్బలం సమ............ర్వర్ధనము త్తమమ్. 90
తృష్ణార్తస్తు న భుంజీత క్షుధార్తో న పిబేజ్జలం,
తృష్ణార్తోజాయతే గుల్మీక్షుధార్తస్తు భగందరీ. 91
భోక్తు కామశ్చ్ఛధాతుశ్చ తోపరాధో విగర్హితః,
అన్నం విషసమం ప్రాహురజీర్ణం ప్రాప్నుయాన్నరః. 92
అన్నం విదగ్ధం విష్టంభి రసశేషం తథైవ చ,
చతుర్విధమజీర్ణం తు తక్రం తత్ర పరిక్రియా. 93
భుక్త్వా తు మథితం సమ్యక్కరాభ్యాం చ విశేషతః,
తత్తోయం నేత్రయోః క్షిప్త్వా నేత్రరోగం జయేన్నరః. 94
భుక్త్వా తు శయనస్థూక్తంభుక్త్వా సంవిశతస్సుఖం,
ఆయుష్యంచరమాణస్యమృత్యుర్ధావతిధావతి. 95
భుక్త్వాచాగ్నిముపశ్పృశ్యగత్వాశతపథం శనైః,
వామపార్శ్వే శయానస్య భిషగ్భిః కిం ప్రయోజనం. 96
దివాస్వాపం న కుర్వీత మిథ్యావాదం న కారయేత్,
దివాస్త్రీసంగమో నృణాం ఆయుఃక్షయకరో భవేత్. 97
ధర్మశాస్త్రాణి సతతం పురాణశ్రవణం తథా,
కారయేద్విధినా సమ్యగాత్మాభ్యాసాంశ్చ నిత్యశః. 98

## ౧౦ తాంబూలవిధి

తాంబూలం చర్వయేద్భుక్త్వాప్రాగేవత్రిచతుస్తథా,
ఏకపూగం చతుఃపత్రం సుధాప్రీహిద్వితీయకం. 99
పూగం సుదేశసంభూతం కఠినం గురుచిక్కణం,

శశమాంససమం భిన్నం క్రముకం తు సుశోభనం. 100
పూగః కషాయో మధురో రూక్షో దోషహారకః పరం,
సుపక్వః సర్వదోషఘ్నః అపక్వాద్దోషదో భవేత్. 101
కటుకీరససంయుక్తం నాగపత్రం సుశోభనం,
సుపక్వదళసంయుక్తం సర్వదోషవివర్జితం. 102
కఫవాతహరం ఖేదినాగపత్రం ప్రకీర్తితం,
దీపనం క్రిమిదోషఘ్నం విశదం నిర్మలం లఘు. 103
సుధాపాషాణజా వాపి శంఖేనాపి వినిర్మితం,
శుక్తిశంబూకసంభూతం చూర్ణం ముక్తాఫలోద్భవం. 104
చూర్ణం పాషాణసంభూతం త్రిదోషశమనం లఘు,
వాతపిత్తహరం శంఖశుక్తిజం శీతలం భవేత్. 105
జంబూకం శ్లేష్మదోషఘ్నం ముక్తాచూర్ణం తు వాతనుత్,
మనసో హర్షణం శ్రేష్ఠం రతిదం మదకారణం. 106
ముఖరోగక్రిమిహరం తాంబూలంచంద్రసంయుతం,
దంతానాం స్థైర్యదం చైవ వక్త్రే దుర్గంధనాశనం. 107
ముఖరోగక్రిమిహరం ఖాదిరేణ విమిశ్రితం,
పిత్తదోషప్రశమనం రక్తపిత్తప్రవర్ధనం. 108
శ్లేష్మరోగ హారం రుచ్యం నేత్రరోగహారం శుభం,
నాసారోగ హారం కంఠ్యం తాంబూలం చంద్రసంయుతం. 109
ఆద్యా విషోపమం పీతం ద్వితీయం ఖేదిదుర్జరం,
పశ్చాత్సుధాసమం పీతం సమ్యగ్జీర్ణం సుఖావహం. 110

క్షీరం పీత్వా ముహూర్తేన తాంబూలం యదిచర్వితం,
కుష్ఠీ భవతి మేహీ చ మూత్రదోషీ చ వా భవేత్. 111
అక్షిరోగి క్షయీ పాండురోగీభ్రమమదాత్యయీ,
అపస్మారీ శ్వాసరోగి హృద్రోగి రక్తపైత్యకీ. 112
గ్రహణీవానతీసారీ తాంబూలం పరివర్జయేత్,
తాంబూలం క్షతపిత్తాసృగ్రూక్షోత్కుపితచక్షుషామ్, 113
విషమూర్ఛామదార్తానామపథ్యం శోషిణామపి,
దివాసంధ్యాం వర్జయిత్వాతాంబూలం ఖాదయేన్నరః. 114
అనిధాయ ముఖే పర్ణం ఖాదేత్పూగీఫలం నరః,
దరిద్రత్వమవాప్నోతి శక్రతుల్యోపి మానవః 115
ఏకద్విత్రిచతుః పంచషడ్భిః పూగీఫలైః క్రమాత్,
లాభాలాభౌసుఖం దుఃఖం ఆయుర్మరణమేవచ. 116
ప్రాతః పూగీ ఫలాధిక్యం మధ్యాహ్నేధికచూర్ణతా,
రాత్రౌతు పర్ణబాహుళ్యమేతత్తాంబూలలక్షణం. 117
ప్రత్యూషేభుక్తసమయే వరయువతీనాంచ సంగమేప్రథమే,
విద్వద్రాజ్ఞాం మధ్యే తాంబూలం యోన ఖాదయేత్సపశుః.
పర్ణమూలం భవేద్వ్యాధిః పర్ణాగ్రం పాపసంభవం,
చూర్ణం పర్ణం హరత్యాయుస్సిరాబుద్ధివినాశినీ. 119
తస్మాదగ్రం చ మూలం చ నరాంచైవ వివర్జయేత్,
చూర్ణపర్ణం వర్జయిత్వా తాంబూలం ఖాదయేత్సుధీః. 120
దివాసంధ్యాం వర్జయిత్వా తథా పర్వదినేషు చ

౧౧ స్త్రీసంభోగవిధి

రాత్రౌ వ్యవాయం కుర్వీత యోషితం యౌవనే స్థితాం,

కురూపిణీం సుశీలాం తు విధవాం చ పరస్త్రియం, 121
అతికృష్ణాం చ హీనాం చ పుత్రమిత్రనృపస్త్రియం,
త్యజేదంత్యకులోద్భూతాం వృద్ధస్త్రీకన్యకాం తథా. 122
వయోధికాం స్త్రియం గత్వా తరుణః స్థవిరో భవేత్,
తారుణ్యం తరుణీం గత్వా వృద్ధోపి సమవాప్నుయాత్. 123
రతికాలేకశయనమన్యత్కాలే పృథక్శయీ,
స్త్రీణాం శ్వాసానిలైః పుంసాం దౌర్భగత్వం ప్రజాయతే. 124
ఏకశాయీ ద్విభోజీ చ షణ్మూత్రీ ద్విపురీషకః,
స్వల్పసంగమకారీచ శతవర్షాణి జీవతి. 125
అత్యంబుపానాదతిసంగమాచ్చస్వప్నాద్దివాజాగరణాచ్చరాత్రౌ,
నిరోధనాన్మూత్రపురీషయోశ్చషడ్భిఃప్రకారైః ప్రభవంతిరోగాః.
గోశతాదపిగోక్షీరం ప్రస్థంధాన్యశతాదపి,
ప్రాసాదాదపిశయ్యార్ధం శేషాఃపరవిభూతయః. 127

౧౨ సత్ప్రవర్తనవిధి

క్షుతంవస్త్రేణసంవృత్యజృంభణం నాసికేనతు,
బిందుసంరక్షణేచ్చైవశతవర్షాణిజీవతి. 128
విచార్యదేశకాలౌచవయస్సత్వం తథాబలం,
జలపానముషఃకాలేపీత్వాశతసమం వసేత్. 129
అంభసః ప్రసృతాన్యష్టౌ పిబేదనుదితే రవౌ,
వాతపిత్తకఫాంజిత్వా జీవేద్వర్షశతం సుఖీ,
రద్రవ్యంపరస్త్రీంచపరనిందాంచబుద్ధిమాన్. 130

అమిత్రభాషణం కార్యం స్త్రీష్వాలాపంచవర్జయేత్.
వర్జనం చాప్యగమ్యాయా అభక్ష్యాయాశ్చ భక్షణం. 131
అసూయావర్జనం కార్యం పతితైస్సహ సంగమః,
క్రౌర్యస్యవర్జనం చైవ మాత్మస్తుతి వివర్జనం. 132
దానం మనోరమం కార్యం ఇష్టాపూర్తస్యవర్ధనం,
అశేషదేవతా భక్తిర్గోషు విప్రేషుతర్పణం. 133
శుశ్రూషణం గురుస్త్రీణాం తపస్తీర్థేషు మజ్జనం,
విద్యాయాస్సేవనం చైవ సతతం సాధుసంగమః. 134
దీనాంధకృపణానాంచ భృత్యానాం చైవ పోషణం,
కారయేత్సతతం భక్త్యా కీర్తిలక్ష్మీ వివృద్ధయే. 135

---

హితాయ రాజపుత్రాణాం సజ్జనానాం విశేషతః,
చారుచర్యా ప్రియా శ్రేష్ఠా రచితాభోజభూభుజా. 136

---

శ్రీ ర స్తు

మంత్రి యప్పవిరచిత

# చారుచర్య

క. ప్రత్యూష బహుళతిమిరా
దిత్యుఁడు శ్రీకీర్తి భారతీసంతత సం
[1]పత్త్యున్నతిప్రదుఁ డగు హరి
నిత్యుఁడు [2]నాగాఖ్యయప్పనికిఁ బ్రియ మొదవన్. 1

ఉ. రాజహితంబుఁబొంటె సుకరం బగువైద్యసునీతి ధర్మని
ర్వ్యాజపథానుసార మగునట్లుగ నిర్జరభాషఁ దొల్లి యా
భోజునిచేతఁ జెప్పఁబడి పొల్పగు నీకృతి నాత్మసత్కళా
భోజుఁడు మంత్రి యప్పన ప్రబుద్ధుఁడుచేసెఁ దెనుంగు
బాసగన్. 2

క. రేపకడ మేలుకొని యఘ
నాపకమతి దంతధావనవిధిజ్ఞుం డై
తాపుణ్యకాష్ఠమున మా
నోపేతుం డగుచు వలయు నొనరింపంగన్. 3

ఆ. ఖదిరమును వటమును గానుఁగ జిల్లేడు
వేము మద్దిజువ్వి వీనియందు

1 ప త్యున్నతుండు శ్రీహరి 2 గాంబ

నాగరు చేఁదు కార మొనరిన చెక్కలఁ
దడిపి తోమవలయు దంతములకు. 4

సీ. ఆయురారోగ్యంబు లగు మద్దిమామిడి
కణమున శ్రీలక్ష్మి గలుగు మిగుల
పీడ లెల్లను వాయుబీజపూరంబున
రణజయం బొదవుఁ గరంజకమున
విత్తలాభము సంభవించును మారేడు
నొదవు ఘనప్రజ్ఞ యుత్తరేన
నరుచిహారము జాడ్యహారముఁ జేయును జంద్ర
సిద్ధించు నతుల వాక్సిద్ధి జువ్వి

తే. జాజి దాడింబమున దిరిసమున గొడిసె
మొదల నంకోలమునఁ గల్గు మోక్షలక్ష్మి
సింధువారంబునను రావు చెడ్డకలలు
దంతధావనకర్మంబు లింతవట్టు 5

క. ప్రియరుచ్యము కఫపైత్య
క్షయకారి మనఃప్రసన్నకారణము శ్రుతి
ద్వయనాడి శుద్ధికరమును
నయనహితము దంతధావనము మనుజులకున్. 6

చ. తెలియుచు నిద్ర శౌచవిధిఁ దీర్చి యనుష్ఠితదంతకాష్ఠుఁడై
జలశుచిగాత్రుఁడై నియమసద్విధిఁ గైకొని తాపహా
రాగ్ని గ్ని, పొలుపగుభక్తి నిష్టసురపూజకుఁడై గృహా
కృత్యకారి గావలయుఁ బ్రభాతకాలమున వారిజగర్భకుల
ప్రసూతకిన్. 7

ఉ. అంగసుఖంబు, దుర్గుణము లారయఁ [illegible] మందు, [illegible]
క్తి,రంగు, సుపోషణంబు సుకరంబ[illegible] మ[illegible]
వచ్చు న,భ్యంగన మాచరించుట[illegible]
వారిఁ జే,యం గడునొప్పు నాల్గుగడి[illegible] జలకంబు యథా
విధిజ్ఞుఁ డై.

సీ. పుణ్యనిర్మలతోయముల నొండె నుష్ణోద
కముల నొండెను బ్రయత్నమునఁ జేయు
స్నానంబువలయుఁ; బ్రాతస్స్నానమునఁ జేసి
తొమ్మిది చిల్లులఁ దొరఁగుచున్న
యేహ్యంబు పట్టగు నిమ్మేను శుచి యగు
నంతియకాదు నాప్యాయనంబు
శౌచంబు బలము దుస్స్వప్ననాశంబును
తేజంబు రూపుకాంతియు సుకృతము
తే. నాయు రభివృద్ధియును గల్గునంతమీఁద
సంధ్య నారాధనముచేసి సవితఁ గొల్చి
యగ్ని దేవు నుపాసించు టర్హవిధము
నిజకులాచార మార్గైకనిరతులకును. ౯

క. ఆచారానంతరమునఁ
బ్రాచి ముడువవలయుఁ గేశపాశంబులఁ గా
లోచితజలముల గరగర
రాచిన కస్తూరి పూయ రమణీయ మగున్. 10

క. పరిమళము గల్గుపూవులు
ధరియింపఁగ దాన నుండు తల[illegible]

చ్చిరఁ జెమటకంపు తొలఁగును
నరులకు మతి దెలియు నసువు నయనముల కగున్. 11

ఉ. గేదఁగిపువ్వు దాలిచి సుఖంతురు మేలు జవాది పూసి హృ
న్మోదముగాఁగఁ గన్నెరులు మొల్లలతో వకుళప్రసూనముల్
జాదులు పాటలంబులును సంపెగలుఁ శతపత్త్రకంబులుఁ
శ్రీదనరారు భోగులు ధరింతురు కస్తురిఁ గూర్చి వేడుకన్.

క. గోరంటపువ్వు మరువము
చేరిక విరవాజివిరులు చెంగలువలు క
ర్పూరమునఁ గూర్చి ముడుతురు
నారీజనపంచబాణనాగమయప్పా. 13

ఉ. మొల్లలు జాజి క్రొవ్విరులు మొత్తములుఁ గరవీరరాజి దా
వెల్ల దొలంకుపువ్వు కురువేరు త్రిదోషహారంబు లారయఁ
చల్లఁదనంబు దీన సమాజం బగుగొజ్జఁగ నీరు గొంతపైఁ
జల్ల ధరింతు రర్థిమెయి జాణలు వేసవిరాత్రు లెప్పుడున్. 14

క. గురువిందలు గన్నెరులు
పరువపువనమాలికలును పాటలములుని
ర్భరశీతోష్ణంబులు గా
వరయఁగ నవి మేలు ముడువ నంబుదవేళన్. 14

క. పొన్నలు చేమంతులు సుర
పొన్నలు సంపెఁగలు మొగలిపువ్వులు పొగడల్
పన్నుగ హిమమున ముడుతురు
ఇన్నియు నుష్ణంబు లగుట యెఱిఁగిన భోగుల్ 16

సీ. ఘటికాద్వయము దాఁకఁ గంపుజాదులనుండు
విరవాజిమొల్లలు వీనరెట్టి

పొన్నలయం దుండుఁ బొలుపార నొకజాము
మల్లెల నాయినఁ మూఁడు దడవు
కరవీరములయందు గురువిందపువ్వులఁ
బొగడల నంతియ ప్రొద్దు నిలుచు
నొకపగల్ రేయును నుండ సంపెంగల
వెలయఁ జేమంతి తద్ద్విగుణముండు
తే. దాని యొవర్తు చెంగల్వతావి యునికి
యయిదురాత్రులు గేదంగియందు వలపు
పుడమిఁ గలుగొట్టు సురపొన్న పువ్వులందు
మాన దెప్పుడు గంధంబు మంత్రియప్ప. 17
క. విరవాదులు మొల్లలు క్రొ
వ్విరిజాజులు ముడువ మేలు వెండ్రుకలు గడుఁ గ
గరగర నయియుండుతఱిఁ గ
శిరమున నెపుడైన ముడువఁ జెంగలువ దగున్. 18
క. ధర నుష్ణవస్తువులలో
నిరతంబును నుష్ణకరము నేత్రములకు దు
స్తరబాధక మగు మఱిహిత
కరములు గావనిరి మల్లికాకుసుమంబుల్. 19
ఆ. మైదపువ్వుకంటె మల్లెలకంటెను
బుడమిలోనఁ గీడు పువ్వు లేదు
మొగలిపువ్వుకంటె మొగిఁ జెంగలువకంటె
మేలుపువ్వు పుడమిమీఁద లేదు 20
క. తలమాసినపుడు మల్లెలు
వలయుఁ గ ముడువంగఁ దొంటివారలు కేశం

ళుల నూనియ విడువనితఱిఁ
గలుగు హితం బంద్రు కేతకంబుల ముడువన్. 21

మ. అగరుం గుంకుమపువ్వుఁగూర్చి శిశిర వ్యాసంగికాలంబునన్
మిగులం గొజ్జఁగనీరు కప్పురమున న్మేదించి ఘర్మంబునన్
మృగనాభిన్ ఘుసృణంబునం గలిపి యమ్మేఘావళీవేళలం
దగునుద్వర్తనపూర్వకంబున నలందన్ జందనం బిమ్ములన్. 22

క. జలకంబు దీర్చినప్పుడె
వలయున్ దడియొత్తఁ గాంతివచ్చును బిటికా
దులు వొందకుండు గండువ
గలుగదు మఱి దాన నునుపు గాత్రమున కగున్. 23

శా. సీతుంగందువఁ బట్టుచీరలును మాంజిష్ఠంబులున్ దోఁపులున్
వాతశ్లేష్మనివృత్తిహేతువులు, దుర్వారోష్ణకాలంబులన్
జేతోమోదము పైత్యహానియుఁ గడుం జేకూరుఁ జెంగా
వులన్, శ్వేతచ్ఛాయపటంబు లభ్రపట లీవేళం ద్రిదోషఘ్న
ముల్. 24

ఆ. మలిన మైనయదియు మగువ గట్టిన యదియు
నితరజనుల యదియు నెలుకపోటు
ఖండమైన యదియుఁ గాలిన యదియు వ
ర్జింపవలయుఁ జుమ్ము చీరలందు. 25

ఉ. మాసినవానఁదీఁటయు నమంగళభావము నొందు నంగనా
వాసము గట్ట భాగ్యము నవారితశౌర్యముఁ దప్పుఁ బుణ్య
ముల్, చేసినఁ గోలుపోవు నొరుచీరధరించిన నెల్కపోటుసం
త్రాసముఁజేయు ఖండపరిధానము జెప్పకుఁ బట్టు మేదినిన్.

క. శాలినచీర ధరించిన
మేలు దొలంగుటయె కాదు మిక్కిలి కీడై
కాలునిపశ మగుఁ గావున
వాలాయము దానిఁ బాఱవైవఁగవలయున్. 27

చ. తేపులులు సెందనోడు నధిదేవత లిత్తురు మెచ్చి సంతతో
త్సవములు రత్నభూషణవితానము దాల్పఁగ నట్లు లేనినాఁ
డవయవశుద్ధి హేతు రుచిరాభరణంబులు దాల్పఁగాఁ
దగుఁ, రవణముపొంటె లక్కయును రాగియు సీ డవిగావు
దాల్పఁగన్. 28

క. దానములుచేసి యట స
న్స్నానంబున దేవపితృసమభ్యర్చనముల్
పూని యొనరించి పిమ్మటఁ
గాని చనఁగవలదు భుక్తి కార్యంబునకున్. 29

క. గోవుం గనకము విప్రుఁడు
పావకుఁడు ఘృతంబు జలము భానుండు ధరి
త్రీవిభుఁ డీయెనిమిదియు శు
భావహములు మంగళాష్టకాఖ్యం బరయన్. 30

క. అవలోకన మభివందన
మవధానముతోడఁ జేసి యర్చించుట భ
క్తివిధిఁ బ్రదక్షిణించుట
యవిరళనియమమున వీనియం దర్హంబుల్. 31

క. కులకాంతచేతఁ దగుక్రియ
నలంకృతం బైన భోజనాగారములో

నెలమీఁ దనబంతిఁ జుట్టులుఁ
జెలులుం దగభోజనంబు సేయఁగవలయున్. 32

క. పెక్కండ్రు లేకయున్నను
నొక్కఁ డిరువురైనఁ బంక్తి నోగిఁ గుడువక తా
నొక్కండ భుక్తి గొను టది
యెక్కుడునింద్య మనిచెప్పి రిద్ధచరిత్రుల్. 33

క. ఇష్టఫలసిద్ధి చేకుఱుఁ
దుష్టియుఁ బుం గలుగుపేర్మి దొరయును సుజనో
త్కృష్టుఁ డగు భోజనము వి
స్పష్టముగాఁ జేయునేని బహుజనములతోన్. 34

చ. గొనకొని కొండముచ్చులు చకోరములున్ శుక శారి
కావళిన్, బెనుతురు భూపతుల్ విషము వెట్టినయన్నముఁ
జూచి యొాలిఁ జ్వయ్యెన నవి వెండ్రుకల్ విడువ నత్తులు
మూయఁగఁ గూయుచుండఁగాఁ, గని కుటిల ప్రయోగములు
గాంచుటకై నృపమంత్రిశేఖరా! 35

తే. మునుపు తియ్యకూరలు రుచిగొనుట లెస్స
నడుమ నొగరులు చేదులు నంజు మేలు
పులుసు లాస్వాదనము సేయవలయుఁ బిదప
భోజనము సేయునపుడును భూమిపతులు. 36

క. అతిమధురము దీపనకర
మతిలవణము నయనకాంతిహార మాహారం
బతితిక్తామ్లము ముదిమికి
నతిశయహేతు వని చెప్పి రాయుర్వేదుల్. 37

తే. దప్పి కుదకంబు మాటికూ డొప్పఁ గొనఁగ
క్షుధకుఁ గూటి మాటుగ నీరు గ్రోలఁ జనదు
గుల్మ మగుభగందరము నం గురువు పుట్టుఁ
జెలఁగి యీరెండు నేరక చేసిరేని. 38

తే. కుడువఁ దొణఁగుచు నీళ్లను గ్రోలెనేని
దీపనము చెడుఁ దద్దయు దేహ మఱుగు
భుక్తిమధ్యోదకము కొంత పుష్టి నేయుఁ
బిదపఁ బానీయ మానుట పెద్ద మేలు. 39

తే. కడుపు నాలుగుపాళ్లనుగా నెఱింగి
రెండుపాళ్లన్నమునను బూరింపవలయుఁ
బానమున నింపఁగా నొకపాలువలయు
వాయుచలనకు నొకపాలు వలయు నెడము. 40

తే. కుడిచినప్పుడఁ శయనింపఁ గడుపు పెరుగు
కదలక కెచ్చోటఁ గూర్చున్నఁ గలుగుసుఖము
అల్ల నడ యూడ నాయువు నగ్గలించు
దూర మరిగిన మృత్యువు దోన యరుగు. 41

క. కడుపు కడుఁబిక్కటిల్లినఁ
బొడమును ముఱిదప్పి హీనభోజనుఁ డైనన్
బడుగగుఁ గావున సమముగ
కుడుపున నేతెవులు లేక కొలఁదియొడ లగున్. 42

క. కుడుచు నతం డైనను బె
ట్టిడు నాతం డైననపుడు డెందము రెండై
కడుఁ గోపముతో నుండినఁ
గుడిచినయన్నంబు కాలకూటముఁ బోలున్. 43

క. కుడిచిన పిమ్మటఁ జేతులు
తుడిచి నియతి వార్చి మధనతోయము నియతిక్
బిడిచికొనవలయుఁ గన్నులఁ
బొడమఁగరా దక్షిరోగముల కల్లైనన్. 44

క. దళముగఁ గ్రోలుచు నుండిన
జల మేమియు నాన కున్న జఠరము శిఖి దు
ర్బల మగునన్నం బఱుగదు
పలుమఱు నగు నల్పవారి పానముసేయన్. 45

సీ. కఠినమై దొడ్డచిక్కణమునై వత్సరా
ర్ధంబు వోయిన ప్రాఁతదనముగలిగి
యుజ్జ్వలచ్ఛాయమై నొత్తిన తరువాయి
శశమాంసఖండంబుచంద మగుచు
నొగరించుకయులేక మిగులంగఁ దీపైన
క్రముకంబు లెఱ్ఱనై కమ్మ వలచి
దళ మెక్కి పండిన తాంబూలదళములు
శాలోపలంబులు కాల్చి వడియఁ

గీ. గట్టినటువంటిచూర్ణంబుగా నొనర్చి
భుక్తి ముందర నాలుగుభోజనోత్త
రమున రెండును నటమీఁద రాత్రి నాఱు
మార్లు తాంబూల మొప్పారు మంత్రియప్ప. 46

సీ. పోఁకకు మూఁటి చొప్పునఁ బర్ణములు గూర్చి
తగుఁజేయ రేపటి తమ్ములములు
నాలుగు నైదులు నొలిన కొలఁది మ
ధ్యాహ్న నిశీథినీసమయములను

కాఁచు పథ్యము రేపకడ తమ్ములములతోఁ
దొలిఁ దొలి నొకరెంటఁ గలయవలయు
నంతంత నెక్కించి యటమీఁదఁ జేయుత
మ్ములములయందుఁ గప్పురము మేలు
తే. తొడిమెయును దుదయును బుచ్చి నడిమి యీనె
లేక తడియొత్తి మడఁచిన యాకు లెస్స
ప్రథమరసమును రెండవరసము నుమిసి
యంతమీఁదట రస మాను టమృతసేవ.  47

క. తాంబూలదళములకు నై
జం బయ్యెను గుణము భేదశక్తియుఁ గఫపై
త్యంబులఁ జెఱుచుటయును గం
దంబు మొగంబునకు నొసఁగఁ దాఁజాలుటయున్.  48

క. పూగమునకు గుణములు పై
త్త్యాగమముం జెఱుచుటయును నాఁకలి మృదులీ
లాగతిఁ బుట్టించుటయును
వేగమె దాహంబు నణఁచు విన్నాణంబున్.  49

సీ. లఘుకారి క్రిమిదోషవిఘటనసంధాయి
దీపననిర్దోషదీప్తికరము
పాషాణచూర్ణంబు పైత్యవాతఘ్నంబు
శంఖచూర్ణము కఫపైత్యహరము
చిప్పలసున్నంబు శ్లేష్మంబు హరియించు
గుల్లసున్నము వాతగుణముఁ జెఱుచుఁ
దెలివిచ్చుఁ జాలముత్తియపుసున్నము చూర్ణ
పర్ణ మాయువునకు బాధకంబు

తే. పత్త్రమూలములను రోగపటల ముండు
నగ్ర మది పాపములకెల్ల నాశ్రయంబు
నడిమి యీనియబుద్ధి వినాశకరము
వీని వర్జించి తగఁ జేయు వీడియంబు. 50

చ. వదనవికాసనౌరభవివర్ధనకారి లసన్మదాపహం
బుదరవిశేషసౌఖ్యకర ముగ్ధతదోషబలప్రహారి స
మ్మదజనకంబు తమ్ములము మానవతీపరిభోగవేళలన్
ముదనపునర్భవీకరణమంత్రము తుల్యమె దాని కెద్దియున్. 51

తే. క్షీరభోజి యై యపుడు వేగిరముతోడ
తమ్ములముఁ గొన్నఁ గుష్ఠ మాతని నశించు
గడియలోఁ గొన్న మేహంబు గదురు నోల
గడియలోఁ గొన్న మూత్రరోగంబు నొందు. 52

సీ. ఒప్పునిగంధంబు నొంద తున్కియగాదు
మొగమునఁ గలరోగములను జెఱుచుఁ
జెదరనికెంజాయఁ జెందిదంతములు ము
ప్పొర్చునట్లుగఁ జేయు నుదరశుద్ధి
గలిగించుఁ గర్పూరకలితతాంబూలంబు
కఫవాతపైత్యంబు గ్రాఁచు భేది
రక్తపైత్యహారంబు రతిసౌఖ్యదము నాసి
కాగదసంతుయకారణంబు

తే. కన్నులకు శైత్య మొనరించుఁ గంఠమునకు
మధురరుచిఁ జేయుఁ బొందించు మంగళములు
దగ్గఱుగు జిహ్వ చెడ దెట్టి దప్పియైనఁ
దిమ్మఁబడుఁ గప్పురముతోడి తమ్ములమున. 53

ఆ. క్షయము రక్తపైత్యగతి వెఱ్ఱి భ్రమ పాండు
రోగ మత్తిగదము రొమ్ము నొప్పి
కడుపునొప్పి గ్రహణి క్షయకాస గలిగిన
వారు తమ్ముఁదమ్ము వలదు చేయ. 54

క. పగలును సంధ్యలుఁ బర్వము
లగుదినములనిశలు నుడిగి యర్హాపురాత్రుల్
మిగులఁగఁ దమకము సేయక
తగు నయ్యోదినము లెఱిఁగి తరుణులఁ గవయన్. 55

క. సురతంబు పగలుచేసినఁ
బురుషునియాయువు నశించుఁ బుట్టును బాపో
త్కర మగుసంతతి సంధ్యల
సిరి దొలఁగును బర్వతిథుల సిద్ధము రాత్రిన్. 56

సీ. ..............వర్జనీయలు
తగఁ దన్ను నేలి నాతని పురంధ్రి
బంధువు సిల్లాలు, బ్రాహ్మణోత్తము భార్య
చెలికాని పడఁతి వీరలఁ దలంప
మాతృసమానలు మనువు దప్పిన యింతి
కన్నియ ముదిసినకాంత రూప
శీలగుణమ్ములచేత జిక్కి నిందిత యైన
మగువయుఁ దనజాతిమాత్రకంటె

తే. నతిశయం బగువర్ణంబు నతివ బొగ్గు
చాయ మేనిది కడుఁ బల్లచాయపడఁతి
పెద్దవళులది కడురోగి తద్ద బడుగు
గేడి గు జ్జనఁబడు వీరిఁ గూడఁ జనదు. 57

చ. నలికపుఁ గౌను చారు జఘనంబును వట్రువ వట్టిచన్నులున్
బలుచని దీర్ఘనీల కచభారముఁ జెన్ను మొగంబు వాలుఁ గ
న్నులు మెఱుఁగారి సన్నమయి నున్నగు చామనచాయ
గాత్రముల్, బలితపుసిగ్గు గల్గు నెలప్రాయపుసుందరిఁ బొంద
మేలగున్. 58

తే. మెలఁగునప్పుడ క్రొక్కారు మెఱుఁగువోలెఁ
బ్రాంతమున నిల్చినప్పుడు ప్రతిమఁబోలి
యురమునను జేర్చినప్పుడు విరులదండఁ
బోలు తిన్ననికామినిఁ బొందమేలు. 59

చ. ఒదవఁగఁ గూర్చి రేనియును నొప్పదు మన్మథకేళి పిమ్మటన్
సుదతులగాత్రముల్ గదిసి సుప్తి యొనర్చిన రాజకోటికిన్
నిదురలఁ జెందియున్న రమణీతిలకంబుల యూర్పుగాడ్పులన్
జెదిరి తొలంగు నంద్రు కడుఁ జేసిన నాథుల మేలి
పుణ్యముల్. 60

మ. ఇరుప్రొద్దున్నదుఁ డల్పభోజి యయి తా నేప్రొద్దు శుద్ధా
త్ముఁడై, చరణత్రాణములందు నేమరక యోజం బర్వ వర్జ్యం
బుగా, వరనారీరత మౌషధంబు క్రియ నిర్వాంఛామతిం
బొంది యొక్కరుఁడున్ నిద్ర భజించు వీతభయుఁ డాఖ్యా
గాంచు శ్రీయుక్తుఁడై. 61

ఆ. ఆవులింత నోర నాఁచి ముక్కునఁ బుచ్చి
వెలయఁ దుమ్మునట్లు వీడఁకొలిపి
చరమ ధాతురక్ష సమ్మతి నొనరించు
సజ్జనుండు వర్షశతము బ్రతుకు. 62

క. పురుషున కెంతయు సత్యమె
పరమం బగుధర్మమైనఁ బ్రాజ్ఞుండై తా
నొరుఁ బొలిగొనియెడు కల్బిష
కరులయెడన్ బొంకవచ్చు గణకలలామా. 63

ఉ. తాలిమిగల్గి తాఁ బరులదైన్యము వాపుచు శాంతిగల్గి సం
శీలితచిత్తుఁడయ్యుఁ దగ సాహసకార్యము సేయ మైకొనం
జాలి పరోపకారి యయి సంపద కుబ్బనియాతఁ డెప్పుడున్
శ్రీలలనాకటాక్ష సరసీరుహధాముఁడు మంత్రిశేఖరా! 64

క. కారణము దైవ మనుచును
బ్రారంభం బుడుగఁ జనదు ప్రభువుల కెందున్
ఊరక తిలలను దైలం
బేరీతిని బడయవచ్చు నిదచరిత్రా. 65

క. వ్యవసాయవిహీను సాహస
వివర్జితుని నుచితయత్నవిముఖుని నలసున్
దివిరి సిరి గవయ నొల్లదు
యువతీరత్నంబు వృద్ధునొల్లనిభంగిన్. 66

చ. సముచితయత్నశక్తియుతసాహసుఁడై తగునుత్తముండు మ
ధ్యము బలహీనసాధనము లారయఁ జెప్పఁగ నేల రెండుపా
దములనె కల్గి యూహానుదు దాఁటె సముద్రము కాటితేని
యశ్వమునకు నూఱుగా ల్గొదవి సన్నపుఁగాల్వయు దాఁటఁ
గల్గునే. 67

మ. గిరులెవ్వారలు ప్రోచి పెంచి రిటు నింగిన్ ముట్టఁగా నేరులె
వ్వరు వాటంబులుగాఁగఁ ద్రవ్విరి మృగవ్రాతంబు సేవింపఁగే

సరికిం బట్టముగట్టి రెవ్వరు ము హైశ్వర్యంబు లుత్సాహులై
తిరు........మంత్రియప్ప సుతకీర్తి నాగమాంబాసుతా!

ఆ. వర్ధమానులైనవారికి నాపద
హీనజనులకంటె నెక్కుడండ్రు
కచవితానమునకుఁ గాక ఖండన మెందు ము
చెప్పవెండ్రుకలకుఁ జెప్పఁబడెనె. 69

క. వలనై కార్యము సామో
క్తులఁ దీఱఁగ దండమునకుఁ దొడరఁగ నేలా
ఫులఖండమునన పైత్యము
పొలియంగా నేల చేఁతిపొట్లరసంబుల్. 70

ఉ. దీనత దోఁపకుండఁ గడుఁ దీ వెసఁగం బ్రియ మాడ నేర్ప
గున్, దానము గల్గియున్ బొగడఁ దద్ద సహింపమి చాల
మేలు వా,ణీనిధి వక్తనాఁ బరగి నిష్ఠురభాషుఁడు గామి
లెస్స పెం,పూన సమర్థుఁ డయ్యు నిలుపోవుట యొప్పును నప్ప
ధీమణీ! 71

తే. ఆత్మకునివలెఁ బాతకుం డయినవాని
నన్యుఁ గొనిరైన వెసఁ దెగటార్పవలయు
ఇంటఁ బుట్టియుఁ గీడైన యెలుకఁ జంపఁ
బిల్లికిని దుగ్ధములుపోసి పెంచుకరణి. 72

క. కారణమున మిత్రులగుట
కారణమున శత్రు లగుట గల దిట్లగుటన్
ధారుణి నెవ్వరు నెవ్వరి
వారునుగా రెల్లవారు వసుపరతంత్రుల్. 73

సీ. పగలు నిద్రింపక పరకాంతఁ గోరక
పరదూషణములేక పరుల కెపుడుఁ
గీడు చింతింపక కినుకయుఁ గపటంబు
గలుగక చవి యెంత గలిగెనేని
పథ్యంబు శుచియును భక్ష్యంబుగాని ప
దార్థంబుమీఁదఁ దత్పరతలేక
బుడుబుడులాడుచుఁ బడఁతుల మొగముల
వెడమాయమాటలు వినఁగఁబోక
తే. పలుకుతఱి జడివెట్టక పరుసగాక
బొంకులాడక తన్నుఁ దా బొగడుకొనక
కెలనివారికి మేలైన నెలమిఁ బొందు
మనుజునకు నభ్యుదయ మొందు మంత్రియప్ప. 74

సీ. విద్వన్నుతుండు భారద్వాజగోత్రుఁ డా
పస్తంబసూత్రుఁడు పరమపుణ్య
విమలోజ్జ్వలాంగి గోవిందార్యునకుఁ గుల
ద్వయశిరోభూషణధర్మచరిత
నాగమాంబకుఁ గూర్మినందనుఁ డప్పయ
మణి మాళిసింగనామాత్యు మేన
యల్లుఁడు ధార్మికుఁ డనఘుండు శ్రీవల్ల
భాచార్యతమ్ముండు హరిపదాంబు

తే. జాతపట్పదుఁ డుభయభాషాకవిత్వ
మాపవైదగ్ధ్య డప్పనమంత్రివరుఁడు
సంస్కృతంబున నొప్పారు చారుచర్య
తెనుగుచేసె దా నెంతయు తేటపడగ. 75

క. గోవిందార్యుని యప్పన
గావించినచారుచర్య కర్ణాభరణ
శ్రీవిబుధు లందుఁ బడయుచు
భూవలయములోఁ బ్రసిద్ధిఁ బొందెడుగాతన్. 76

శుభమ్ శమ్.

# చారుచర్యపద్యలఘుటీక



1. శ్రీకీర్తిభారతీసంపత్ప్యన్నతపదుఁడు = లక్ష్మీ కీర్తి సరస్వతి లేడ తెగనిసంపద నొసఁగువాఁడు.

2. వైద్యసునీతిధర్మనిర్వ్యాజపథానుసారమగునట్లుగ=వైద్యము మంచి నీతి ధర్మము కపటములేనినడవడి వీనికి తగునట్లుగ, నిర్జరభాషన్ = దేవభాషలో సంస్కృతభాషయందు.

3. అఘనాశకమతిన్ = పాపమును పోఁగొట్టుకొనెడిబుద్ధితో, దంతధావనవిధిజ్ఞుండై = పండ్లుతోముకొనుపద్ధతి నెఱిఁగినవాఁడై, మానోపేతుండగుచు=మానముతోఁ గూడినవాఁడై.

4. ఖదిరము = చండ్ర, వటము = మఱ్ఱి.

5. కణము=గుగ్గిలపుచెట్టు, బీజపూరము=మాదీఫలము, కరంజకము = కానుఁగు, దాడింబము=దానిమ్మ, సింధువారంబు=వావిలి.

6. కఫపైత్త్యక్షయకారి=శ్లేష్మమును పైత్యమును పోఁగొట్టునది, శ్రుతిద్వయనాడిశుద్ధికరము =రెండుచెవులకు నాడులకు శుద్ధిని కలిగించునది, నయనహితము=కన్నులకు మంచిది.

7. తెలియుచు నిద్రన్=నిద్రనుండి మేలుకొనుచు, శౌచవిధిదీర్చి= మూత్రపురీషములను విడిచి,అనుష్ఠితదంతకాష్ఠుఁడై =పండ్లుతోముకొనినవాఁడై, హుతాగ్నియై=అగ్నిహోత్రమునందు, హోమము చేసినవాఁడై, గృహకృత్యకారి=ఇంటిపనులను జేయువాఁడు, ప్రభాతకాలమున = ప్రాతఃకాలమునందు, వారిజగర్భకులప్రసూతికిన్ =బ్రాహ్మణవంశమునఁ బుట్టినవానికి.

8. అభ్యంగనము = నలుగు పెట్టుకొనుట, జలకంబు = నీరుపోసికొనుట, యథావిధిజ్ఞుఁడై=కార్యవిధానము నెఱిఁగినవాఁడై.

9. తొరఁగుచున్న = కాఱుచున్న, ఏహ్యంబుపట్టు = అసహ్యమునకు నెలవు, ఇష్మేను=ఈశరీరము, ఆప్యాయనము = తృప్తినికలిగించునది, ఉపాసించుట=పూజించుట, నిజకులాచారమార్గైకనిరతులకును = తనకులాచారమునందు నిష్ఠగలవారికి.

10. కేశపాశంబులన్=తలవెండ్రుకలను, గరగర=నునుపుగా, రాచిన=మర్దించిన, రమణీయము=అందము.

11. చుండు=తలవెండ్రుకల మొదలఁబుట్టు రోగవిశేషము, వఱితెలియంన్=బుద్ధివికసించును, అనువు=మంచి.

12. హృన్మోదముగాఁగ = మనస్సునకు సంతోషము కలుగునట్లుగా, వకుళప్రసూనముల్=పొగడపువ్వులు, పాటలంబులు=కలిగొట్టుపువ్వులు, శతపత్త్రకంబులన్=తామరపువ్వులను, శ్రీదనరారుభోగులు = ఐశ్వర్యముగలిగిన భోగిపురుషులు.

13. నారీజనపంచబాణ = స్త్రీజనమునకు మన్మథస్వరూపుఁడా !

14. డొలంకు=తొలఁకు-చిమ్ము, అర్థిమెయిన్=ప్రీతితో, జాణలు = రసికులు.

15. నిర్జరశీతోష్ణములు=మిక్కిలి చల్లన వెచ్చన అయినవి, అంబుదవేళన్=వర్షాకాలమున.

17. ఇనుమాఱుదడవు=రెండురెట్లు సమయము. తద్ద్విగుణము=దానికి రెండురెట్లు, ఓవర్తు=రెట్టింపు?

19. దుస్తరబాధకము=విశేషమయిన బాధను కలిగించునది.

21. కేతకంబులు=మొగిలిపువ్వులు.

22. శిశిరవ్యాసంగికాలంబునన్ = శిశిరఋతుసమయమునందు, మేదించి=నూరి, ఘర్మంబునన్=గ్రీష్మకాలమునందు, మృగనాభిన్=కస్తూరిని, ఘుసృణము=కుంకుమపువ్వు.

23. పిటికాదులు=కురుపులు మొదలగునవి, గండువు=బొటిమి?

26. తీట=దురద, అంగనావాసము=స్త్రీలు కట్టుకొన్నబట్ట, సంత్రాసము=భయము, జేష్టకుఁబట్టు=అభాగ్యమునకుఁ దావు.

27. కాలునివశము=యమునకు స్వాధీనము, వాలాయము=అవశ్యము తప్పకుండ.

28. తెవులులు=రోగములు, అవయవశుద్ధిహేతురుచిరాభరణంబులు=అవయవములపరిశుద్ధికి కారణమయిన అందమగు అలంకారములు, రవణము=అలంకారము.

29. దేవపితృసమభ్యర్చనముల్=దేవతలకు పితృదేవతలకు పూజలు సేయుట, భుక్తికార్యంబునకున్=భోజనమునకు.

30. కనకము=బంగారము, విప్రుఁడు=బ్రాహ్మణుఁడు, పావకుఁడు=అగ్ని, ఘృతంబు=నెయ్యి, భానుండు=సూర్యుఁడు, ధరిత్రీవిభుఁడు=రాజు, శుభావహములు=పుణ్యమును కలుగఁజేయునవి.

31. అవలోకనము=చూచుట, అభివందనము=నమస్కరించుట, అవధానముతోడన్=ఏకాగ్రతతో, అర్చించుట=పూజచేయుట, అవిరళనియమమునన్=ఎడతెగని నిష్ఠతో, అర్హంబులు=తగినవి.

32. చుట్టలున్=చుట్టములును.

33. భుక్తిగొనుట=భోజనముచేయుట.

34. పేర్మిదొరయును = గొప్పతనము కలుగును, సుజనోత్కృష్టుఁడగు=సజ్జనులలో గొప్పవాఁడగు, విస్పష్టముగాన్=అందఱకు తెలియునట్లుగ, బహుజనములతో=చాలమందితో.

35. [illegible] ంచి, ఓలిన్=వరుసగా, చయ్యనన్=వెంటనే. (విషముతోఁ గూడిన [illegible] ను జూచినంతనే కొండముచ్చులు వెండ్రుకలు విదుర్చుచు చకోరములు కన్నులు మూయును. చిలుకలు గోరువంకలు కూఁతలు కూయును, కుటిలప్రయోగములు=దుష్టులు రహస్యముగఁ జేయుపనులు.

36. నంజు=నంజుకొనుట, ఆస్వాదనము చేయుట=తినుట.

37. అతిమధురము=మిక్కిలి తియ్యనైనది, అదీపనకరము=జఠరాగ్ని దీప్తి లేకుండ చేయునది, అతిలవణము=చాల ఉప్పనైనది, నయనకాంతిహారము=కన్నులందలి కాంతిని (చూపును) హరించునది, అతితిక్తాన్నము=చాల కారము పుల్లన అయినది, ముదిమికి=ముసలితనమునకు, అతిశయహేతువు=ప్రధానకారణము.

38. దప్పి=దాహము, కూడు=అన్నము, క్రోలఁజనదు = త్రాగకూడదు, గుల్మము=భగందరము, అంగురవు=మూలరోగవిశేషములు, నేరక=ఎఱుఁగక.

39. కుడువఁదొణఁగుచు=భోజనము చేయఁబోవుచు, దీపనము=జఠరదీప్తి. తద్దయు=మిక్కిలి, అఱుగు=కృశించును, భుక్తిమధ్యోదకము=భోజనము నడుమ త్రాగెడు నీరు, పిదపన్=భోజనమయిన తరువాత.

40, పానమున=నీరుత్రాగుటచే, వాయుచలనమునకు=గాలికదలుటకు,

41. కుడిచినప్పుడ=భోజనము చేసిన వెంటనే, శయనింపన్=నిద్రించినచో, అల్లనడయాడన్ = మెల్లఁగా తిరిగినచో, అగ్గలించు=అతిశయించు, తోన=కూడనే.

42. పిక్కటిల్లినన్=నిండినను, పొడమును=బయలుదేఱును, హీనభోజనుఁడైనన్ = తక్కువభోజనము చేసినవాఁడయిన, బడుగగున్ = చిక్కిపోవును, కుడుపునన్=భోజనముచే.

43. డెందము రెండై=వేఱుమనస్సుకలవాఁడై.

44. వార్చి=అచమనముచేసి, నియతిగా = తప్పకుండ.

45. దళముగ=హెచ్చుగ, జఠరము శిఖి=జఠరాగ్ని.

45. చిక్కణము=స్నిగ్ధమును లేక చెక్క, వత్సరార్థంబు=సంవత్సరములో సగము,అఱుమాసములు, ఒత్తినతఱువాయి=కోయఁగా మిగిలినది. శశమాంసఖండంబుచందంబు=చెవలపిల్లిమాంసము ముక్కవిధము, క్రముకంబులు=పోఁకలు, కమ్మవలిచి=పైపెచ్చుతీసి, దళమెక్కి=దళసరియై

48. సైజంబు=సహజము, భేదశక్తియు=జీర్ణముచేయుశక్తియు.

49. విజ్ఞానంబు=విశేషగుణము.

51. వదనవికాససౌరభవివర్ధనకారి=ముఖమునకు వికాసమును పరిమళమును వృద్ధిపొందించునది, లసన్మదాపహంబు=విశేషమయినమత్తును పోఁగొట్టునది, ఉదరవిశేషసౌఖ్యకరము=కడుపునకు మిక్కిలి సౌఖ్యమును జేయునది. ఉద్ధతదోషబలప్రహారి=పెరిగిన వాతాదిదోషములనుహరించునది, సమ్మదజనకంబు=సంతోషమును కలిగించునది. మానవతీపరిభోగవేళల=యువతులతో భోగించుసమయములందు.

53. ఒప్పనిగంధంబు=కూడనివాసన, చెదరనికెంజాయ=పోవనిఎఱ్ఱనికాంతి, ముప్పొర్చునట్లుగ=ముడిమిని సహించునట్లుగ, లేక బాధను సహించునట్లుగ, క్రాఁచు=కరగఁజేయును, నాసికాగదసంక్షయకారణంబు=ముక్కులలోని రోగములుపోవుటకు కారణము, తిమ్మఁబడును=పోఁగొట్టఁబడును.

57. బొగ్గుచాయమేనిది=బొగ్గువలె నల్లనైనశరీరముకలది, కడుఁబల్లచాయపడఁతి=చాలఎఱ్ఱనైన కాంతిగలస్త్రీ, కడురోగి=హెచ్చురోగముకలది, తద్దబడుగు=చాల చిక్కినిది, గేడి=పొడుగుకాళ్లుగలది, గుజ్జు=కడుపొట్టిది.

58. నలికపుఁగౌను=సన్ననినడుము, వట్రువల్లచన్నులఁగ=గుండ్రని

లిసిన స్తన[illegible], దీర్ఘ[illegible]భాగ[illegible]ముగైన నల్లనివెండ్రుకలు, చెన్ను మొగంబు=అందమైనముఖము, [illegible]=తళుకెక్కి, గాత్రముఁ=శరీరమును, బలితపు[illegible]ప్రాయపుసుందరిఁ=యౌవనములో నున్న అందకత్తెను.

59. క్రొక్కారుమెఱుఁగువోలె=వర్షాకాలపు మెఱుపువలె, ప్రతిమ=బొమ్మ, విరులదండ=పూలదండ.

60. మన్మథకేళిపిమ్మటఁ=సంభోగమయినతరువాత, సుదతులగాత్రముల్=స్త్రీల శరీరములు, కదిసి=కూడి, సుప్తి=నిద్ర, రమణీతిలకంబులయూర్పుగాడ్పులఁ=స్త్రీరత్నముల నిట్టూర్పు వాయువులచే.

62. ఆఁచి=ఆపి.

63. పాలిగొనియెడుకిల్బిషకరులయెడఁ = ఇతరులను నశింపఁజేయుచుండు పాపాత్ములయెడల.

64. శ్రీలలనాకటాక్ష సరసీరుహా ధాముఁడు = లక్ష్మీకటాక్షమునకుఁ బాత్రుఁడు.

66. వ్యవసాయరహితుఁ = పని చేయనివానిని, సాహసవివర్జితుని = సాహసమును విడిచినవానిని, ఉచితయత్నవిముఖుని=తగిన ప్రయత్నము చేయని వానిని, తివిరి=పూని, సిరి=లక్ష్మి, కవయనొల్లదు=చేరుట కంగీకరింపదు.

70. వలనై=సరిపడినదై, సామోక్తులఁ=సామవాక్యములచే, తొడరఁగఁ=మొదలుపెట్టఁగ, పులఖండము=పటికబెల్లము.

73. వసుపరతంత్రులు=ధనాధీనులు.

74. కినుక=కోపము, చవి=రుచి, జడివెట్టుట=వర్షము కురిపించుట, పరుస=కఠినము, కెలనివారికి=దగ్గరనున్నవారికి, నెలమి=సంతోషము, అభ్యుదయము=అభివృద్ధి.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1949.

# వేదాంతగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అద్వైతసంగ్రహము, తెనుఁగువచనము | ... | 0 | 2 |
| అద్వైతోపదేశపంచరత్నములు ,, | ... | 0 | 3 |
| అద్వైతానుభూతి ,, | ... | 0 | 3 |
| ఆత్మబోధము, సాంద్రటీక | ... | 0 | 6 |
| ఆనందలహరి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 6 |
| అద్వైతపంచరత్నములు ,, | ... | 1 | 0 |
| అద్వైతవేదాంతపరిభాష, సవ్యాఖ్యానము | ... | 1 | 8 |
| అద్వైతానుభూతి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| ఆత్మపూజ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| ఆత్మవిద్యావిలాసము ,, | ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ,, | ... | 0 | 6 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు | ... | 1 | 0 |
| ఉపదేశసాహస్రి, ఆంధ్రతాత్పర్యము | ... | 5 | 0 |
| కామకలావిలాసము ,, | ... | 2 | 8 |
| విద్యారణ్యకృతజీవన్ముక్తిప్రకాశిక ,, | ... | 3 | 0 |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, ఆంధ్రటీకాతాత్పర్యము | | 5 | 0 |
| ప్రశ్నోత్తర రత్నమాల, ఆంధ్రతాత్పర్యము | ... | 0 | 8 |
| పంచీకరణము, ఆంధ్రతాత్పర్యము | ... | 0 | 3 |
| ,, తెనుగు వచనము | ... | 0 | 3 |
| నారదపురూరవసంవాదము, పద్యము | ... | 0 | 3 |
| భక్తిపలనముక్తి | ... | 0 | 1 |
| బ్రహ్మసూత్రములు, మూలము | ... | 0 | 4 |
| ,, శంకరభాష్యము (సంస్కృతము) | ... | 10 | 0 |

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| భగవద్గీతాసారసంకీర్తనలు | ... | 0 | 2 |
| భగవద్గీతలు, మూలము, చిన్నసైజు | ... | 0 | 10 |
| ,, కాలికోబైండు | ... | 0 | 14 |
| ,, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| ,, ,, బ్రౌనుపేపరు | ... | 1 | 4 |
| ,, ద్వైతమతానుసారమైనవివరణము | ... | 1 | 0 |
| ,, శ్రీరామచంద్రసరస్వతీకృత ఆంధ్రటీకాతా॥ స॥ | | 6 | 0 |
| ,, అనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమా | ... | 0 | 12 |
| మహావాక్యదర్పణము, ఆంధ్రతాత్పర్యము | ... | 1 | 8 |
| శంకరగీతాభాష్యము, సంస్కృతము | ... | 2 | 8 |
| వ్యవహారపంచకము, ఆంధ్రతాత్పర్యము | ... | 0 | 3 |
| విచారచంద్రోదయము, తెనుగు | ... | 0 | 10 |
| వేదాంతస్తోత్రపంచకము, శ్లోకము, తాత్పర్యము | ... | 0 | 6 |
| సదాముక్తిసుధార్ణవము, సాంధ్రతా॥చిన్నసైజు | ... | 0 | 10 |
| రామగీతా ,, | ... | 0 | 8 |
| సనత్సుజాతీయము, సటీక | ... | 0 | 8 |
| శంకరవిజయము, సవ్యాఖ్యానము | ... | 2 | 8 |
| వివేకచూడామణి, ఆంధ్రతా॥సహితము | ... | 2 | 0 |
| సౌందర్యలహరి, సాంధ్రటీకాతాత్పర్యము | ... | 0 | 12 |
| శాంతివిలాసము ,, | ... | 0 | 6 |
| శుకాష్టకము ,, | ... | 0 | 2 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్పలనేడ్, చెన్నపురి.

| | | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|---|
| హోమియోపతి గృహవైద్యం | | ... | 1 | 0 |
| వైద్యశతశ్లోకి | | ... | 0 | 6 |
| రసరత్నాకరము | ,, | ... | 8 | 0 |
| రాజమార్తాండము | ,, | ... | 0 | 12 |
| లోలంబరాజీయము, సద్వైద్య జీవనము | | ... | 0 | 12 |
| వస్తుగుణమహోదధి, తెనుఁగు వచనము | | ... | 6 | 0 |
| వృక్షాయుర్వేదము, సాంధ్రతాత్పర్యము | | ... | 0 | 6 |
| శార్ఙ్గధరసంహిత, | ,, | ... | 5 | 0 |
| శార్ఙ్గధర కృతత్రిశతి | | ... | 0 | 8 |
| సుశ్రుతశారీరము | | ... | 2 | 8 |
| షడ్రసనిఘంటువు, అభిధానరత్నమాల | | ... | 0 | 12 |
| సహదేవ పశువైద్యశాస్త్రము, తాత్పర్యము | | ... | 0 | 6 |
| సర్వౌషధిగుణకల్పకము | ,, | ... | 2 | 8 |
| సూతికాచికిత్స, డా॥ వరదప్పనాయుడు | | ... | 1 | 4 |
| దేశీయ వైద్య విజ్ఞానము | | ... | 1 | 0 |

## జ్యోతిష గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| అష్టకవర్గు, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| 60 సంవత్సరముల పంచాంగము (1867-1926) వఱకు | ... | 10 | 0 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | ... | 0 | 12 |
| కాలామృతము, టీకాతాత్పర్యవ్యాఖ్యానసహితము | ... | 3 | 4 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అథ వాస్తుసారసంగ్రహము | ... | 1 | 0 |
| కేరళప్రశ్నము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు | ... | 0 | 3 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము | ... | 0 | 8 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 6 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము | | 0 | 12 |
| నక్షత్రచూడామణి, చక్కని ప్రతి | ... | 0 | 8 |
| పుష్పబంధము, సాధారణప్రతి | ... | 0 | 8 |
| బృహద్యోగరత్నాకరము, తెనుగువచనము | ... | 0 | 12 |
| బృహజ్జాతకము, ఆంధ్రటీకాతా॥ వ్యా॥ సహితము | ... | 5 | 0 |
| భృగుసూత్రములు ,, | ... | 0 | 6 |
| భావార్థచంద్రిక, ఆం॥ టీకా॥ తా॥ | ... | 1 | 0 |
| మయవాస్తువు, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 4 |
| ముహూర్తదర్పణము, సటీక | ... | 2 | 0 |
| రెట్టమతశాస్త్రము, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 0 |
| లఘుజాతకము ,, | ... | 1 | 4 |
| వృద్ధపారాశర్యము, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 0 |
| వనమాల (వర్షఫణి) ,, | ... | 0 | [illegible] |
| వాస్తుసర్వస్వము ,, | ... | 0 | 6 |
| శకునశాస్త్రము, (శిఖినరసింహశతకము) | ... | 0 | 4 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించిన ప్రశ్న గ్రంథమునకు తెనుగు | ... | 0 | [illegible] |
| సనత్కుమారగృహవాస్తువు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| సనత్కుమారశిల్పశాస్త్రము ,, | ... | 0 | 4 |
| స్వప్నశాస్త్రము ,, | ... | 0 | 3 |
| సర్వార్థచింతామణి, సటీక | ... | 5 | 0 |
| సారావళి, సాంధ్రతాత్పర్యము | ... | 3 | 8 |
| సాముద్రికశాస్త్రము, సటీక | ... | 0 | 6 |
| డిటో తెనుగుపద్యకావ్యము | ... | 0 | 6 |
| హోరారత్నమాల, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.